# గోలకొండపత్రిక

వృషనామసం॥ర శ్రావణ బ॥ ౭

గురువారము


## ముందుకా? వెనుకకా?

భారత దేశము రాజకీయంగా ముందునకు నడుస్తున్నట్లా, లేక వెనుకకు నడుస్తున్నట్లా? అనేశంక ప్రబలమైపోయినది. ఇంగ్లాండులో పార్లమెంటులో ఇండియా మంత్రిగారగు అమెరీగారు మాట్లాడడమేలరుదు? ఎప్పుడైనా నవాళ్ళకు జవాబు సెలవిచ్చినా, "కాదు," "లేదు" అనుముక్తసరు ముక్తాఫలాలను జారవిడుచును. ఇండియాచర్చపై మాట్లాడినా జిన్నాగారి పేరు అందుతప్పకుండా ఉంటుంది. పైగా ఏదైనాకొత్త పేచీ లేవదీస్తారు. ౧ ఆగస్టునాడు పార్లమెంటులోవారిచ్చిన మహోపన్యాసం విన్నతర్వాత మనము వెనుకకు నడుస్తున్నాము అను భావన గట్టిపడుచున్నది. ఐకమత్యములేని జాతికి, పరస్పరంకలహించే దేశానికి, దేశాభిమానంలేని సంఘానికి నిష్కృతి యెన్నటికిని కలుగదు.

ఇప్పుడు ఇంగ్లాండు దేశానికి ప్రధాన మంత్రిగారు చర్చిల్ గారైయున్నారు. వారు మంత్రిపదవి స్వీకరించిన నాటినుండియు రెండుమారులేమో ఇండియాపేరెత్తుకొన్నారు. ఎత్తుకొనిఇండియా సిపాయీలు బహద్దరీగా యుద్ధముచేసినారని చెప్పి షాబాష్ అన్నారు. అంతే! అయితే ఈ ప్రధానమంత్రిగారింతులకు ఇంతగట్టిగా మౌనముద్రవేసుకొన్నారు. అంటేవారి భావనలను మనము గుర్తించుటకుగాను వారు ౧౯౩౧లో రౌండుటేబిల్ సమావేశములో నిండుపార్లమెంటులో చెప్పిన అభిప్రాయాలనుస్మరణకుతెచ్చుకోవలయును ఆవేవనగా—ఇండియాకు స్వాతంత్ర్యమిస్తామని గవర్నరు జనరలుకాని, ఇండియామంత్రికాని ప్రధానమంత్రికాని తుదకు చక్రవర్తికాని ఏమిచెప్పినా అది చెల్లనేరదు. పార్లమెంటులో శాసనము ఒక్కటే ఇంగ్లీషువారిని బంధించును-అని చెప్పిరి. అదే కాలములో చర్చిలు గారిట్లనియుండిరి: "ఇంగ్లాండులోని అయిదుమందిలో నలుగురు ప్రకారం సామ్రాజ్యముపై ఆధారపడి బ్రతుకుచున్నారు." అంత మాత్రమేకాదు. వారింకా ఇట్లుసెలవిచ్చిరి.

> "చక్రవర్తిగారి కిరీటములో ఉండే అనర్ఘరత్నమైన హిందూస్థానమును మేము ఎన్నటికీనీవదలుకోనము"
>
> (We have no intention of surrendering the most precious jewel in His Majestys Crown, Ind a.)

ఇట్టి అభిప్రాయాలుకలిగిన చర్చిలుప్రధానమంత్రిగారు ఇప్పుడు ఇండియా విషయంలో అదేపనిగా మౌనంవహించినాడంటే, దానికి అర్థమాతునేయున్నది. ఇట్టి మంత్రాంగములో అమెరీ,ఇండియామంత్రిగారొకరు. వారు ఒకసులభసూత్రంకనుగొన్నారు: "భారతీయులు తమలోతాము సమాధాన పడవలెను కాని మాదేముందయ్యా. వారంతాయేకవాక్యంగా ఏదినిర్ణయించుకొంటారో దాన్ని మేము ఆచరణలో పెట్టుతాము" అని పదేపదే అంటున్నారుపాపం. కాని భారతీయులకేమి వచ్చిందోకాని వారు సమాధానపడరు. ఒకఇంటిలోని ఏకోదరులైన అన్నదమ్ములు సమాధానపడరు అప్పుడు న్యాయంచెప్పే కచ్చేరీవారు న్యాయంప్రసాదించుతారు. మరి యింత పెద్ద భారతదేశంలో నిండిన హిందూ, ముస్లిం, సీకు,క్రైస్తవాది మతాలవారు సమాధానపడుతారా? ఒక వేళ ఎవరు సమాధానపడినా ముస్లింలీగువారు ఒప్పుకొంటారా? వారొప్పుకోకుంటే, అమెరీగారున్నూ ఒప్పుకోనట్లే! ఒక వేళ ముస్లింలీగుకూడా కాలవైపరీత్యంవల్ల సమాధానపడితే చాలునా అంటే అంతటితో వ్యవహారం ఆగలేదు. ౫౬౦చిల్లర దేశీయసంస్థానాలవారున్నూ సమాధానపడవలెను. ఈప్రభువులుతమగొంటెమ్ రైతులతో గోచిబట్టకూలీలతో ఎట్లుసమాధానపడగలరు? ఒక వేళ వారున్నూ సమాధానపడిరిపో! అప్పటికినీ వ్యవహారమాగనట్లున్నది. ఎందుకంటే మొన్ననే (౧ ఆగస్టునాడు) పార్లమెంటులో అమెరీగారేమన్నారు? హిందూస్థానానికి ప్రజాపాలనం (డెమాక్రసీ) పనిపోదుఅని అన్నారు.ఎందుకంటే అల్పసంఖ్యాక వర్గాలవారిదెప్పటికిన్ని కుక్కబ్రతుకేనట. (The minority always remains the underdog) అట్లైతే ఏమిచేయవలసియుండును. ఇంకేముంది. ఇండియాలో ప్రజాపరిపాలనం రద్దుకావలసిందే, వేరేఆలోచనలు చేయవలసినదేఅనిఅమెరీగారు సెలవిచ్చినారు. There our system ceases to be workıble & other methods have to be devised. వేరేపద్ధతులంటే యెట్లుండును? అంటేవాటి స్వరూపం మనమూహించుకోవలెను. బహుశా౧౯౩౫ ఇండియా శాసనం యుద్ధానంతరం రద్దగును. దాని తావులో హైద్రాబాదు రాజ్యాంగశాసనంవంటి శాసనం రావచ్చును. ఈ వాక్యాన్ని చదువుకొన్నవారు దిగ్భ్రమచెంది ఆశ్చర్య పడవచ్చును. కాని పూర్వాపరములను విన్న తర్వాత యీఊహకుతావున్నదో లేదో చూడండి.

కొన్నిమాసాలక్రిందట అమెరీగారు "భారతదేశములోని కొన్ని దేశీయసంస్థానాలలో ప్రత్యేకవర్గాల ప్రాతినిధ్యము Functional represetation of varied interests ఏర్పాటై యున్నది. అట్టిరాజ్యాంగము బాగానడుచుచున్నదని అన్నారు ఈపరిస్థితిపై. హైదాబాదులో రానున్న రాజ్యాంగశాసనము ఏర్పాటు చేయబడింది.

నేషనలు డిఫెన్సుకౌన్సిలులో వైస్రాయిగారు వివిధవర్గాలవారిని నియామకముచేసినారు. వీరందరును వ్యవసాయం, వ్యాపారం, కూలి, పరిశ్రమలు, మున్నగు వివిధవర్గాలకు ప్రతినిధులని అమెరీగారు చెప్పుచుతుండకిట్లన్నారు. ఈ పద్ధతిపై ముందురాజ్యాంగమునడుచునని సూచననుకూడా అమెరీగారు చేసినారు. సర్ సప్రూగారు కొన్నిదినాల క్రిందట బొంబాయిలో మితవాదులసభ కధ్యక్షతవహించిన సందర్భములో సభాంతిములో భారతదేశము జాగ్రత్తగా ఉండవలెను అని యీక్రింది విధముగా సెలవిచ్చిరి.

"పరిస్థితిచూడగా చాలాగొప్ప ఉపద్రవము కలిగేటట్లున్నది. అందులోను విశ్లేషించి శాసనసభయొక్క అజ్ఞచే తొలగించ వీలుకానట్లుగా కార్యనిర్వాహకవర్గము నేర్పరచు సిద్ధాంతమును, వృత్తులనుబట్టి ఆవర్గమందు ప్రతినిధులను ఏర్పరచు సిద్ధాంతమును బలపరచువాలుకుబడిగల పురుషులు ఇంగ్లాండులోను భారతదేశములోనుకూడఉన్నారన్న సంగతిని జ్ఞాపకముంచుకొన్నపుడు ఆ ఉపద్రవము సంగతి తలకెక్కగలదు. ఇటువంటిప్రణాళికల అంతరార్థమును ప్రజలుసరిగా తెలిసికొనవలెను. ఈప్రణాళికలకు ఇంగ్లాండులో గొప్పపలుకుబడిగల వారలప్రోద్బలమున్నది. ఇట్టిఅభిప్రాయములుగల వారలు కొందరు భారతదేశములోనుగలరు. వారలలో కనీసముఒకరైనను వైస్రాయిగారి కార్య నిర్వాహకవర్గమందు ఒక సభ్యుడుగావచ్చును."

ఈ కారణాలచేత భారతదేశ రాజ్యాంగం వెనక్కు నడుస్తూ ఉందని ద్యోతకమౌతుంది.

భారతీయులు తరతరాలనుండి పైనాన్సు (కోశము) డిఫెన్సు (సంరక్షణలేక సైన్యము) అనురెండు శాఖలను తమవశంచేయవలసిందని కోరుచూ ఉండిరి. ఇతర శాఖలను భారతీయ మంత్రులకిచ్చినారు కాని యీ రెండున్నూ భారతీయుల కియ్యలేదు. ఇదేమండీ అనిఅంటే అమెరీగారిట్లంటున్నారు. ఈ శాఖలు ముఖ్యమైనవికావు అందుచేత భారతీయుల కియ్యలేదు. ముఖ్యంకానివే భారతీయులకు పారవేసి ముఖ్యమైనవని చెప్పేసప్లై శాఖ, కూలిశాఖ తామేఉంచుకొంటే ఎంతోఅనుగ్రహంగా ఉంటుంది మహాప్రభో అనియెందుకో ఒకభారతీయరాజకీయనాయకుడున్నూ అనలేద!

లార్డు హాలీఫాక్సుగారు (లార్డు ఇర్విన్ అను పేరుతో) భారతదేశపు వైస్రాయిగా ఉండి మొన్నటివరకు అమెరికాలో ఇంగ్లీషు రాయబారిగా ఉండిరి. వారిని అమెరికావారు నిలదీసి ఇండియాకుస్వాతంత్ర్యమిచ్చేమాట కేమంటారు, అనిఅడుగగా వారు చెప్పినదేమంటే.

౧. భారతదేశానికి స్వాతంత్ర్యమిచ్చేగడువు నిర్ణయించుట కష్టము, అసంభవము.

౨.ఇంగ్లీషువారు తమసామ్రాజ్య ప్రత్యేకస్వత్వములను (Imperial preference) వదలుకోరు.

అని ఇతర కారణాలతోపాటు పైరెండు ముఖ్యకారణాలను కూడా తెలిపినారు.

ఇవన్నింటిని సమన్వయించుకుంటే ఏమిపర్యావసానం? మన ప్రాచీనులు వేదాంతపక్షముగాను గణితశాస్త్ర పక్షముగాను చెప్పిన

> "పూర్ణమదఃపూర్ణమిదం
> పూర్ణాత్పూర్ణముదచ్యతే
> పూర్ణస్య పూర్ణమాదాయ
> పూర్ణమేవావశిష్యతే"

అను తత్వాన్ని మననముచేసుకొని తృప్తిపడవలసి యుంటుంది.

---

## గోలకొండడైరీ

౧౯౪౧ ఫ.

౧౦౦౦ ప్రతులకు పైగా అమ్ముడుపోయినవి.

లెక్క చూచుకొంటే మాకు నష్టం కనబడుతుంది

౮ మెహరులోపల మాకార్యాలయంలో వసూలైన ఆర్డరుపై ప్రాతధర తీసుకొంటాము

ఇక ౮ మెహరునాటినుండి క్యాలికో డైరీధర

౧ రూపాయి

| | |
|---|---|
| సగం చర్మం | ౧—౪—౦ |
| పూర్తిచర్మం | ౨—౮—౦ |
| రెండుకాపీలు | ౦—౧౪—౦ |

(నోటు:— మనియార్డరుపంపువారు టపాఖర్చుక్రింద ౦—౫—౦ పంపవలెను)

---

## ఆత్మరక్షణకై శరీరబలము ఉపయోగించుట

### కాంగ్రెస్ వాదుల కర్తవ్యము
### గాంధిమహాత్ముని ప్రకటన

వర్ధా,౧౧, ఆగస్టు ౫

గాంధిమహాత్ముడు పత్రికలకు ఈక్రింది ప్రకటన గావించుచున్నాడు:—

"పంజాబునందలి లాల్ జెయిలులోని రజానంది నాకువ్రాసిన ఉత్తరముయొక్క సంక్షేపము పత్రికలలో నేనుసూచించితిని. ఉత్తరములో చేయబడిన ప్రశ్నయేమనగా: బందిపోటుదొంగ ఒకడు దౌర్జన్యముచేసి, తన ప్రాణమునకు అపాయముకలిగించునపుడు కాంగ్రెసుసభ్యుడు ప్రతిక్రియగా దౌర్జన్యపద్ధతులననుసరించినను. కాంగ్రెసులోసభ్యుడుగా నుండవచ్చునా?

"వీలగును. ప్రతికాంగ్రెసునిబంధనను బుద్ధిపూర్వకముగా భగ్నముచేసినప్పటికిని జనులు కాంగ్రెసులో నుండవీలగును. కానిఅట్టివారు కాంగ్రెసులో నుండవీలగునాయని నన్నడుగుచో మాత్రమునుండరాదని నేనుప్రత్యుత్తరమొసంగుదును. ఇదిసామాజికజీవమునకు సంబంధించినవిషయము. మంతరంగిక ప్రవర్తన విషయమున కాంగ్రెసువారు నియమమేదియు గావించియుండలేదు. తనఆస్తిని దౌర్జన్యముచే హరించుదొంగను లేక, తనకుమాత్రమేవమునుభంగపరుప ప్రయత్నించుచున్నవానిని దౌర్జన్యముచే ప్రతిఘటించువారి ప్రవర్తనమునువిచారింప కాంగ్రెసున్ని రాకరించును. కాంగ్రెసుయిట్టిచేయుట సమంజసమేయినను ఆత్మరక్షణకై కాంగ్రెసువారు రేర్పరుచు వాలంటీరుసంస్థలును, కాంగ్రెసువారు చేరియున్న వాలంటీరుసంస్థలును దౌర్జన్యరాహిత్యమునకు కట్టుబడియుండవలెనని పూర్వాలోచింపబడియుండిన కాంగ్రెసుతీర్మానము స్పష్టముగా తెలియుచున్నది. ఈనిబంధనను భగ్నము చేయువారు, అట్టిసందర్భములలో కాంగ్రెసువాదులు దౌర్జన్యముపయోగింపవలెనని ప్రచారముచేయువారు కాంగ్రెసునుండి వెడలగొట్టబడవలెనా అనునదివేరువిషయము. నాఅభిప్రాయముస్పష్టమే. అట్టివారినినేనుకాంగ్రెసునుండి వెడలగొట్టను, ఢిల్లీకాంగ్రెసుకమిటీ అధ్యక్షునికి నేనువ్రాసినఉత్తరమునకు అపార్థముగావింపబడెను. అట్టివారినికాంగ్రెసునుండి వెడలగొట్టరాదని నేనుస్పష్టముగాచెప్పియుంటిని. అట్టిచర్యచాలరుదుగా గైకొనబడవలెనని నేనుమొదటినుండియు తలచుచుంటిని.

### మున్షీగారి వ్యవహారము

మున్షీగారిక చేసిచ్చిన సలహాకుకొందరు అపార్థములుచేసిరి. అట్టివారిని వెడలగొట్టవలెనని నేనను చున్నానని వారుతలచిరి. మున్షీగారుగైకొనినచర్య ఉదాత్తుడగుపురుషుడు గైకొనిన చర్యయని నాయభిప్రాయము, బహిరంగము గావారు ఆక్షేపింపదగిన దేదియుచేసియుండలేదు. వారికికొన్ని సంశయములుకలిగి నన్ను సలహాఅడిగిరి, కాంగ్రెసునుండి వెడలిపోవుటవారికిని, కాంగ్రెసుకును గూడ క్షేమమని నేనుచెప్పితిని, ఇందులవంతమును మాత్రమునేకుండెను. వారు ఐచ్ఛికముగానీతిబద్ధులై కాంగ్రెసునుండి వెడలిపోయిరి. నేనిచ్చిన సలహాకు దుఃఖపడవలసినఅవసరమేమియు నాకు కనబడదు. ఇట్టిసందర్భములన్నిటియందును నేనిసలహానియ్యుటకు సంశయింపను."

---

## సికింద్రాబాదు ధర్మవైద్యశాల

### గతసంవత్సర నివేదిక

ఉచితఔషధాలయము ౧౯౪౦సంవత్సరముతో నాలుగుసంవత్సరములుజరిగినది. గతసాంవత్సరిక నివేదికను తాముచూచియుందురు.ఈసాంవత్సరిక నివేదికనుచూచినప్పుడు వైద్యాలయముయొక్కస్థితి అభివృద్ధిమార్గముగానున్నదని తెనుకు స్పష్టముకాగలదు. ఈసంవత్సరమునందు ఆదాయమునుండి ఖర్చులుపోను రూ౧౫౧—౫—౧నిలువలేలుచున్నది. ఔషధములకుగాను రూ౩౫౦ వెచ్చింపబడెను. ఇందులో రూ౧౯—౧౩—౧ నిలువబాకీ. అయితేబ్యాంకిలో రూ౧౧౮—౦—౦ నిలువ కనబడుచున్నది. గతసంవత్సరమునకంటే యీసంవత్సరముకూడనిర్వహణము నిశ్చయముగను బాగుగాతోను జరిగించుటయునుస్పష్టము. రమారమి మనిషికొక్కటికి ౩౧/ అణాలు వ్యయముచేసినట్లు తేలుచున్నది.

వైద్యాలయమునకువచ్చు రోగులసంఖ్య నానాటికి పెరుగుచుండున్నది— గతసంవత్సరముకంటె యీసంవత్సరము నాలుగువేలమంది పెరిగిరి. అనగానూటికి౧౦వృద్ధి. నూతనరోగులసంఖ్యలో యీసంవత్సరమున రెండుహిందువులలోను, ౪౦౦ మహమ్మదీయులలోను కనబడుచున్నది— అనగా హిందువులసంఖ్యలోవృద్ధి నూటికి౧౦. మహమ్మదీయులలోనూటికి౨౦— ఈవిషయమునుబట్టి యీసంస్థ హిందూమహమ్మదీయ ప్రజలయొక్క సమానమైన ఆదరగౌరవములను పొందుచున్నట్లు కనబడుచున్నది—

గతసంవత్సరము ప్రభుత్వమువారి సహాయము పొందలేకపోయితిమని తెలియజేసితిమి. నిరుత్సాహముచెందక అవిషయమునకృషిజరుపుచు నేయున్నాము— అచిరకాలములో ఫలదాయకముకాగలదని విశ్వసించుచున్నాము—

ఇదివరలో ఉదారులగుప్రజలు చందాదారులుగను పోషకులుగనుచేరి మాకుతోడ్పడినారము, ప్రోత్సాహముకలిగించిరిరో అట్టివిధముగనే ద్విగుణీకృతోత్సాహముతో సహాయముచేసెదరని నమ్ముచున్నాము.

ఈఏడు మొత్తము చికిత్సపొందినవారు౩౯౮౩౯ మంది— అందుహిందువులు ౩౮౦౭౫మంది, మహమ్మదీయులు౧౯౩౩౭మంది, క్రిస్టియనులు ౨౩మంది క్రొత్తవారు పాతవారిమొత్తము౩౦౭౭౫.

గతసంవత్సరములోచందాలు, ధర్మపెట్టిలో వేసినది, పారితోషికము, బ్యాంకిలోఉన్నదాని వడ్డీకలసి రూ౯౧౧—౩—౦లుఆదాయము. చందాలవల్లవచ్చినది రూ౭౦౬—౬—౦లు— ఔషధాలకైఖర్చు రూ౩౭౩—౯—౧లు — ఇంటిబాడుగ ఇతరఖర్చులుపోను రూ౧౫౧—౫—౧లు మిగిలినది.

---

## నిజామియా కళాశాల

హైదరాబాదు[దక్కన్]. మెహరు ౩ హైద్రాబాదులోని నిజామికాలేజీయొక్క వార్షికోత్సవము ఘ.ఉ.ర-బిరారు యువరాజాగారి అధ్యక్షతలో ౩ మెహరునాడు జరిగెను. ఆసందర్భములో శ్రీవారికి కాలేజివారు సన్మానపత్రమర్పించుచు ఈకళాశాల పూర్వనిజాంగారిచే ప్రారంభింపబడి ఇప్పటిప్రభువులగారి తిరోవకత్వములో నడిపింపబడుచున్నదని చెప్పిరి, అందున శ్రీయువరాజాలంగారు వారిని అభినందించుచు ప్రసంగవశమునఇప్పటియూరోపుయుద్ధములో బాలురను స్త్రీలనుగూడ చంపుచున్నారని విచారమును వెలిబుచ్చిరి.

## కొలనుపాక బాలికాపాఠశాలజప్తి

పోలీసుఅధికారులతో ఉత్తరప్రత్యుత్తరముల వివరములు

కొలనుపాక పోలీసుస్టేషన్ దఫ్తరము నుండి పంపినపత్రము

కొలనుపాకజాగీరు, భోనగిరితాలూకా, నల్గొండజిల్లా, ౩౦ షహరేవరు ౧౩౫౦ ఫ.

సయ్యద్‌జియాఉద్దీన్ హైదరీ, పోలీసు సబు యిన్స్‌పెక్టరు, కొలనుపాకస్టేషను హౌసుండి కొలనుపాక గ్రామకాపరస్థుడగు రామచంద్రారెడ్డి-

విషయం: వీరనారాయణస్వామి దేవాలయపు ఆవరణలో ఖానిగిపాఠశాల ప్రారంభించుట-

యీవిషయంలో నీకు తెలుపునదేమనగా వీరనారాయణస్వామి దేవాలయములో ఏనూతన భవనమైతె ఆజ్ఞపొందకుండ నిర్మించబడినదో అందునీభార్య బాలికలపాఠశాల నెలకొలిపినది. మరియు పాఠములు బోధించుచున్నది. కావున ఇదిమట్టుగానే ఖానూను ప్రకారము ఖానిగీపాఠశాలపెట్టుటకు అనుమతిపొందినది తెలుపవలసినది- ఆజ్ఞపొందినచో ఆజ్ఞాపత్రము నివేదించవలసినది- లేనిచో పాఠశాలను ఎత్తివేయవలెను-

(సంతకము) ముంతజిమ్‌పోలీసు కొలనుపాక

కొలనుపాక బాలికా పాఠశాల దప్తరము నుండి జవాబు

౩౧ షహరేవర్ ౧౩౫౦ఫ.

కొలనుపాక బాలికాపాఠశాలకార్యదర్శియగు రామచంద్రారెడ్డినుండి కొలనుపాక పోలీసు స్టేషన్ ముంతజిమ్ గారికి

విషయం:- కొలనుపాక బాలికా పాఠశాల స్థాపన.

౧ ముంతజిమ్‌పోలీసునుండి నిషాన్[౨౫౫] ౩౦షహరేవర్ ౧౩౫౦ఫ-తేదిన వచ్చిన బాబుకు జవాబు ఏమనగా? వీరనారాయణస్వామి దేవాలయములో కట్టబడినభవనము ఆజ్ఞపొందనిదికాదు. ౩తీరు౧౩౫౦ఫ-తేదిన. తహశీలు నుండినిషాన్ గల మురాసిలాద్వారా ఆజ్ఞపొంది భవనము నిర్మింపబడినది-యిందు బాలికాపాఠశాల స్థాపింపబడినది. మరియు దీనికై ఆజ్ఞపొందుటకు వేరే కొరుచున్నాము జరుగుచున్నది-ఇప్పటి ప్రభుత్వఆజ్ఞలను బట్టి ఖానిపాఠశాలకొరకు ఆజ్ఞపొందఅవసరములేదు తెలుపుటచాలును. ఇదేకాకుండ నాకు తెలిసినంతవరకు పాఠశాలస్థాపనతము విషయములో పోలీసు శాఖకు యేమిసంబంధములేదు- విద్యాశాఖకు ఆక్షేపణవున్న అక్కడ జవాబు చెప్పుకొబడును-

ఆ ఆశ్చర్యముకలిగించుచున్న విషయము ఏమనగా నేడు పోలీసుమొహతమీము కొందరు పోలీసు జవానులువచ్చి మాకు తెలియకుండ స్కూలుకు తాళము వేసి పంచులసంతకముగల చిట్టీలువానిపై అతికించి దానిపై పోలీసుపైరావుంచినారు-

జప్తుచేయబడిన స్థలములో స్కూలుకు సంబంధించిన చాలసామాను బాలికలఆటవస్తువులుపుస్తకములు మొదలగునవి వున్నవి- ఆవివాండ్లకు ప్రతిదినము అవసరము- స్థానిక పోలీసు వారి యీ చర్య సంపూర్ణముగ చట్టవిరుద్ధము—మరియుఆక్షేపణీయము-పాఠశాలను రొమ్మిత్తి చేయు సంబంధము పోలీసుకు రేమాత్రములేదు- ఇంకే మహాక్కు మరొకక్కు ఆజ్ఞలున్నను కారణముడుగకనే పాఠశాలభవనమును మరియు వస్తువులను జప్తుచేయకూడదు- పాఠశాల స్థలమును వస్తువులను జప్తుచేయకూడదు- పాఠశాల స్థలమును వస్తువులను ఆక్రమించుకొనుటకు యేమి ఆజ్ఞలున్నవో తెలుపుదురని ఆశించుచున్నాను-

(సంతకము) రామచంద్రారెడ్డి.

పోలీసుము తజిమ్‌దఫ్తర్,

స్టేషన్‌కొలనుపాక

నిషా- ౨౫౩: నిషాన్ మిసల్ ౩౧

విషయం: వీరనారాయణదేవాలయావరణలో ఖానిగిబడిస్థాపన

రామచంద్రారెడ్డిగారికి కొలనుపాక

౩౧ షహరేవర్ ౧౩౫౦ ఫసలి వ్రాతకుజవాబుయేమనగా స్థానికపోలీసువారిచర్య ఆక్షేపణీయమని నిర్ణయించుటకు మీలోకూడ సాహసముకల్గినది. ఆజ్ఞపొందని వెళ్ళాన్లబడిని రొమ్మిత్తి చేయించెఅధికారము పోలీసువారికివున్నది లేనిది నీకేమి తెలియును? ముందు యిట్టిమాటలు సంక్షేపించుకోవాలె "తనహద్దునుతాను తెలుసుకోవలె" అనుసామెతను చదువుకో!! తనదుష్పటికన్న యెక్కువగాకాళ్ళుసాచుకొనుట బుద్ధిమంతుల లక్షణము కాదు-

(సంతకము) జియావుద్దీన్ ముంతజిమ్

## లక్ష్మీనరసింహ రెడ్డిగారి ప్రకటన

పోలీసుఅధికారుల చర్యలు న్యాయబద్ధమైనవికావు

కొలనుపాక మెహరు ౫

శ్రీయుత లక్ష్మీనరసింహారెడ్డిగారు ఈక్రింది ప్రకటనయిచ్చినారు, కొలనుపాకనవాబు ఉరాబుయారుజంగుగారిజాగీరు ఇక్కడప్రజాశ్రేయసకు వీరనారాయణస్వామి దేవాలయావరణములో రామానుజకూటము చందాలువసూలుచేసి నిర్మించవలెనని తీర్మానించిదేవాలయముయొక్క స్థానాచార్యగారితో స్థానికజాగీరుతహశీలులో మొహతమ్మగరకాపులో దరఖాస్తుపెట్టించిరి. దానికిఆజ్ఞకూడదొరికెను, గ్రామమునచందాలు వసూల్చేసి గ్రామాభిమానులు భవననిర్మాణముయొక్క ఆజ్ఞతహశీల్ నుండి నిషాన్ ౧౩౯ తేదిచ ౬-తీరుసన్ ౧౩౫౦ పొందికట్టడము అత్యంతశ్రద్ధాభిమానములతో ఆరంభించిరి ౮౧౫ అమర్దాద్ సన్ ౧౩౫౦లో తహశీల్‌నుండియివ్వబడిన ఆజ్ఞఅధికారమునకు మించియుండుటచే యిరువదినాలుగుగంటలలో నిర్మాణము ఆపివేయవలెనని తహశీల్‌నుండిఆజ్ఞవివబడినది. అట్లుఆపివేయుటవల్లముందరివర్షాకాలాఅసంపూర్తిగవదలివేయుటవల్ల గోడలువర్షాలకునాని నష్టపడుచున్నవి తక్కినయిల్లుకూడ కూలిపడకపోయెను, వెనుతక్షణమే నవాబుగారివద్దకువెళ్లి క్రమబంధంగ జరుగుచున్న కట్టడముఆపించుటవల్ల చాలనష్టమగుచున్నది. కనుక వెంటనేరద్దుపరచవలెనని ప్రార్థించగ తాము స్వయంగాకొలనుపాకకువచ్చిభవనము చూచి ఆజ్ఞయిత్తుమనిసెలవిచ్చిరి. ఒకటిరెండుతోజాలతరువాత కొలనుపాకకువిచ్చేసి కొత్తగకట్టుచున్నయిల్లుచూచి తాము హైదరాబాదుకు వెళ్లి తక్షణమేఆజ్ఞపంపింతుమని రైతులకుచెప్పిఅప్పుడేవెళ్లిపోయిరి- తదుపరిపూజారీలకు దేవాలయముకైలాసమువ్వచున్న, మామాడ్లుజాగీరువాండ్లు యివ్వనిరాకరించిరి. ఈభవనములో ఒక బాలికాపాఠశాల శ్రీ రామచంద్రరెడ్డిగారి సతీమణిగారగు కమలాదేవి గారునడుపుచుండిరి, ౧౦౭౫షహరేవరు ౨ యామురేమునగంటలకు పూర్వమేపోలీసు మొహతమీమునుయియు కొందరుకానిస్టేబిలులు వచ్చిభవనమునకుతాళములువేసి పోలీసుకాపలా రాత్రింబవళ్లువుంచిరి. అందులోపాఠశాల వస్తుసామగ్రియేకాక వేరేయితరసామానువున్నను తెక్కించకతాళముపెట్టిరి ౮౧ మెహరు౧౩౫౦లో జారాత్రియీయిల్లును పోలీసుఅమీనుగారు జప్తుచేసినారనియుయెవరుఅక్కడికిపోయిన శిక్షింపబడురని గ్రామమునందుచాటింపుజరిగెను-

ఆజ్ఞపొందిమంజూరి అయినవక్షా ప్రకారము యిల్లుకట్టబడెను. ఆకారణ గ నిర్మాణముఆపుచేయవలెనన్న ఆజ్ఞలుపాలించబడినను పోలీసువారు యీకార్యకాలములో ఒక్కొక్క వైసప్రోగుచేసి కట్టుకున్నయిల్లుపై దాడిసల్పి-౦దులో బాలికలబడివున్నదనుగణింపక జప్తుచేయుట సరియయినపద్ధతిగాదు. నిర్మాణములో చట్టవిరుద్ధంగనడిచిన శాసన ప్రకారము శిక్షతీసుకోవచ్చునుకాని యిట్లుఅక్రమముగస్థానికజాగీరు పోలీసుయిల్లును స్వాధీనపర్చుకొనుటచే ప్రజలలోఅశాంతిభయము వ్యాపించినది- కాబట్టి ప్రభుత్వముశ్రద్ధవహించి స్థానికపోలీసునుండి యిల్లుయిప్పించుటన్యాయము.

వైష్ణవ కృష్ణజయంతి

శ్రీవైష్ణవకృష్ణజయంతి ఈశ్రావణబ||౧౦ ఆదివారమునాడని శ్రీమాన్-కొడకండ్లరంగాచార్యులు (ధర్మసాగరం)గారును, భాద్రపదబ||౯ ఆదివారమునాడని శ్రీ సముద్రాల రామానుజాచార్యులు (కోరుట్ల)గారును తెలుపుచున్నారు.

శ్రావణి మహోత్సవము

ఆర్యసమాజము, పావనవీధి సికింద్రాబాదు-

వృషనామసం|| శ్రావణశు|| ౧౫ గురువారం, సికింద్రాబాదు పావనవీధి ఆర్యసమాజమువారిచే శ్రావణమహోత్సవము, మహావైభవముగా జరుపబడెను. అందు ఉదయం౭గంటలకు బృహద్యజ్ఞమున్ను ౧౫మందికి నూతనముగా యజ్ఞోపవీతధారణచేయబడెను. పూర్వముఋషులచే వేదధర్మశ్రవణము చేయబడినమాసమే శ్రావణియనియు, ఈ దినములయందు మనముకూడా వేదధర్మశ్రవణము చేసి శ్రావణిఫలమును పొందవలయునని, శ్రీ పం. యం. కృష్ణస్వామి, మునిస్వామి మొదలైనవారిచే మనోహరముగా వ్యాఖ్యానములు చేయబడెను. హైదరాబాదు ఆర్యసత్యాగ్రహుల(స్మారకము) స్మరణచేయబడెను.

రాత్రి-౯గంటలకు శ్రీమాన్ పం. యం. కృష్ణస్వామిగారిచేత, "విభీషణశరణాగతి" హరికథారూపమున కాలక్షేపము చేయబడెను- అందు రక్షా పూర్ణిమను గురించి దీపులను, అభిమ్నులను, రక్షింపబడిన రక్షాబంధనదినమే ఈదినమని విపులముగా తెలిపి శ్రోతలనానందింపజేసిరి. కథాసందర్భమున కీ|| శే|| విశ్వకవి శ్రీరవీంద్రనాథఠాకూరుగారి మరణసంతాపమును వెలిబుచ్చిరి- ప్రేక్షకులతో పహా నిమిషములు విశ్వబ్రాలనిలిచి శ్రీవిశ్వకవి ఠాకూరుగారిఆత్మకు శాంతి చేకూరుగాక యని ఈశ్వర ప్రార్థన చేయబడెను.

సర్కారీనౌకరుల జీతాలహెచ్చింపు

హైదరాబాదు(దక్కన్), మెహరు ౩

యూరోపుయుద్ధంవలన ధాన్యంధరలుచాలా ఎక్కువవి. అందుచేత హైదరాబాదురాష్ట్రములోని చిన్న చిన్న నౌకరులచేసే సర్కారీనౌకరుల జీతాలలో యుద్ధకాలానికిగాను కొంతయెక్కువచేయబడినది. హైదరాబాదునగరములో నెల ౫౦రూ|| అంతకుతక్కువ పొందువారికిని జిల్లాలలో నెలకు౩౫ అంతకులోపలపొందువారికినిరెండుశ్యర, రెండురూపాయిలప్రకారం జీతంయెక్కువచేయబడినది.

సంవత్సరము చందా ౬ పావలా రూపాయలు
ఆరుమాసాలకు ౩ రూపాయలు
బ్రిటిషిండియాలో సం॥ చందా ౭-౮-౦ కల్దారు.
పోతపత్రికలకు వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions
Best Medium for advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 16 . Hyderabad-Dn Thursday 14th August 1941 Number 30**

## కీ. శే. రవీంద్రనాథటాగూరుగారు

### అంత్యక్రియలు: దేశీయుల బాష్పకణములు

రవీంద్రనాథటాగూరుగారు ఈశ్రావణపూర్ణిమ గురువారమునాటి మధ్యాహ్నము నిర్యాణమొందిరి, వారికి కలకత్తాలో అపరేషను జరిగిన తర్వాత అగస్టు రవలేదిన వారు ఉత్సాహముగా నేయుండి వ్యక్తిత్వమునుగురించి కొన్ని పద్యములను రచించిచెప్పియుండిరి, మంగళవారము నాడు వారికిస్పృహతప్పెను.

గతసం అగస్టు గురువారమునాడే [అనగా ౩౫ సంవత్సరముక్రిందట ఇదేరోజు] వారికి ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమువారిచ్చిన 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' అనుబిరుదము శాంతినికేతనమందు సర్ మారిస్‌గ్వయర్ గారిచే సమర్పించబడెను, నిర్యాణమునకుముందు సంవత్సరమందు వారుఅస్వస్థులై పరుండియుండియే ఆ నేక పద్యములను గద్యములను వ్రాసెంగాక, ఆత్మజీవితకథనుకూడ వ్రాసిరి- ఒక్కనిమిషమైనవృథాగా వారు విశ్వభారతి మాటమరచియుండలేదు- ఒక నెలక్రిందట సేవారు తమ పెద్దభవనమునొకదానిని విశ్వభారతికిచ్చి ట్రస్టుకు వ్రాసియిచ్చిరి- వారిబెంగాలీరచనలనుండి వచ్చిన ఆదాయము ఇదివరకెన్నడో విశ్వభారతికొసగబడియుండెను-

టాగూరుగారిమరణవార్త కలకత్తానగరంలో వ్యాపించగానే కలకలాలుబయలుదేరెను. విద్యార్థులు, పౌరులగుంపులుగా రవీంద్రునిభౌతికదర్శనమును కడసారిగావించుకొనుటకై జోరాశంకో భవనమునకుచేరుచుండిరి- ఈజనులగుంపులను సర్దుటకు అదనపుపోలీసుఏర్పాట్లును టాగూరుగారిభవనంలో పైకి కాపోనుఏర్పాటుమన్నచేయబడినది. జనులు పూలమాలలను ఊరేగింపులతో తెచ్చిరి- ఆ నేకులు చైనీయులును, బౌద్ధులును ఆఊరేగింపులలోనుండిరి ఆనేకసంస్థలపక్షమున పూలమాలలు పంపబడినవి. బెంగాలు గవర్నరుగారుకూడ ఒక పూలమాలనుపంపించిరి. ఈపూలమాలలన్నియు రవీంద్రుని భౌతికశరీరముపై అలంకరించబడినవి. శవముఊరేగింపు ౩½ గంటలకు బయలుదేరెను, శవమునుపట్టుబట్టలతోకప్పియుంచిరి. త్రోవపొడుగునను జనులునిలచియుండి పూలు పేలాలు, పన్నీరు శవముపై చల్లిరి. స్మశానమందు శవముపై అండమలోని బెంగాల్ వాసీయుల సంఘపక్షమునను కలకత్తా విశ్వవిద్యాలయపక్షమునను, బెంగాలు హోంమంత్రి సర్ నాజిముద్దీన్ గారి పక్షమునను, అరబ్బీ ఫార్సీ సంఘపక్షమునను, బెంగాలు ముస్లిం విద్యాపీఠముపక్షమునను పూలమాలలువేయబడెను

రాత్రి ౬౹౦ గంటలకు దహనసంస్కారము ఆరంభమయ్యెను. ఆదిబ్రహ్మసమాజాచారప్రకారము సంస్కారము జరుపబడెను- రవీంద్రుని మనుమడగు సుభీంద్రనాథటాగూరుగారు శవమునకు తలకొరివిపెట్టిరి. రవీంద్రుని కుమారుడగు రథీంద్రనాథటాగూరుగారు స్మశానమువరకువచ్చినను జబ్బుగానున్నందువల్ల కర్మజరుపలేకపోయిరి.

స్మశానమువద్ద జనులగుంపు సముద్రమువలెనుండెను- నదిలోపలగట్టునుండి పడవలలో ఆనేకులువచ్చిరి- కొందరునదిమధ్యంలో పడవలలోనుండియేచూచిరి- ఈగుంపులకు ఆడ్డివల్లఅంతకుముందే దహనార్థము తేబడియుండిన మరికొన్ని శవముల దహనములు టాగూరుగారిశవమును దహించిపోయినతర్వాతగాని జరుపబడలేదు. మొత్తముమీద టాగూరుగారిశవమునకుదహనసంస్కారము ముగిసేవరకుఅర్ధరాత్రి ౧౨ గంటలైనది,

### దేశనాయకుల బాష్పకణములు

#### గాంధీమహాత్ముని సందేశము

గాంధిమహాత్ముడు ఇట్లుఅన్నారు:- "రవీంద్రనాథటాగూరుగారి మరణంవలన మనము ఒక ప్రసిద్ధకవీంద్రుని కోల్పోవుటయే కాక, స్వచ్ఛమైనజాతీయవాదిని, దయామూర్తిని పోగొట్టుకున్నాము వీరి వ్యక్తిప్రభావము ప్రతిప్రజాహితసేవలోనూ గోచరించుచునేయున్నది. శాంతినికేతనం, శ్రీనికేతనం అనేయీరెండుసంస్థలను రవీంద్రుడుభారతజాతికిని ప్రపంచమంతటికిని దివ్యభాగముగా వదలిపెట్టి వెళ్ళినారు- వారిపరిశుద్ధాత్మకు శాంతిలభించుగాక! ప్రస్తుతంశాంతినికేతనసంస్థపై యాజమాన్యము గలవారు వారిబాధ్యతలనుపూర్తిగాగుర్తించుకొని ఘనతతోవాటిని నిర్వహింతురని విశ్వసించుచున్నాను,"

#### నెహ్రూగారి సందేశము

పండితజవహర్‌లాల్ నెహ్రూగారు డెహ్రాడూన్ జెయిలులోనుండి యీక్రిందివిధముగా తమ సానుభూతిని వెల్లడించుప్రకటన గావించినారు,-

మహోన్నతవ్యక్తియువంటి గురుదేవుగారి ఛాయక్రింద బ్రతికిన మనలనుఅందరినీ అనాథలనుగా వదలిపెట్టి గురుదేవుపరమపదమొందినారు. తనవిజ్ఞానజ్యోతివలన, ప్రాక్పశ్చిమవిజ్ఞానాలకుసమన్వయముకుదిర్చి, భారతదేశానికేకాక ప్రపంచానికి అంతటికిని దీప్తికొలిపిన దివ్యజ్యోతి అస్తమించినది-

అయినప్పటికిని వారికంఠస్వరము మనచెవులలో మారుమ్రోగుచున్నది- ఇటీవల వారు తెలిపిన సందేశముమనకు ఆదర్శముకాగలదు-

ప్రాచీనమహర్షులవలె రవీంద్రుడుఅవసానసమయములోకూడ మనకుశాశ్వతమైనభాగ్యమును అందజేసిపోయినారు- గురుదేవుజీవనాదర్శములో ముఖ్యవిషయమైన శాంతినికేతనము, విశ్వభారతి సంస్థలఅభివృద్ధికి తోడుపడవలసినబాధ్యత ప్రతిభారతీయునిమీదనుగలదు. ఈవిధముగానే రవీంద్రుడు మనకుఒసగినభాగ్యమును మనంకాపాడుకోవలెను."

#### వైస్రాయిగారి సందేశము

వైస్రాయిపంపిన యీక్రిందితంతి రవీంద్రనాథటాగూరుగారి కుమారునికి చేరినది:-

"మీతండ్రిగారు మరణించిరనువార్త వినగానే నాకుచాలా మనఃక్లేశముకలిగించినది ఆనేకఉన్నతాదర్శాలతో దేశసేవనుపురస్కరించుకుని వారు గడిపినజీవనము ఇంతటితోసమాప్తిచెందినది. ఇకముందు రాబోవుతరాలవారికి రవీంద్రుడుఆదర్శపురుషుడుకాగలరు- దేశోన్నతస్థితికికారకుడైన ఒకగంభీరవ్యక్తిని ఇండియా పోగొట్టుకొనినది, మీకుతీరనిలోటుకలిగినది- నాసానుభూతులను స్వీకరించవలసినదని కోరుచున్నాను"

#### హాలిఫాక్సు ప్రభువు

"రవీంద్రకవి మరణించినందుకు ఇండియాతోపాటు నేనుకూడాదుఃఖించుచున్నాను- వీరుఅమూల్యమైనజ్ఞాననిధిని వారిరచనలద్వారాను భావాలద్వారాను ప్రపంచానికివెల్లడించినభారతీయప్రముఖులు" అనిహాలిఫాక్సుప్రభువుగారు అభిప్రాయమిచ్చినారు-

## అమెరీ ఉపన్యాసములోని అంతరార్థము

### ఆచార్య కృపలానీగారి అభిప్రాయము

వర్ధాగంజ్, అగస్టుర:

అమెరీఉపన్యాసమునుగురించి ఒకవిలేఖరి ఆచార్య జె-బి- కృపలానీగారిని ప్రశ్నించగా వారుఇట్లుచెప్పినారు:-

"అమెరీగారుతిరిగి మరియొకసారి ప్రసంగించినారు- ఒకేమాట పదేపదేచెప్పుకొనుచుతెల్లినచో ఆదివిశ్వాసమును ప్రజలకుపుట్టించగలదని వారికిఉదేశముగాతోచుచున్నది- ఇంగ్లాండు, అమెరికాదేశములవారు అవాక్యములనువిననలేననివారిఉద్దేశ్యమైనట్లు మనకుస్పష్టముగా తెలియగలదు- వారిఉపన్యాసములపట్ల ఇక్కడదేశములోకలిగిన ప్రతికూలభావములను వారికెవరైనస్పష్టముగా తెలియచేసినచో అప్రతికూలాభిప్రాయములపట్ల వారికేమైనలక్ష్యమున్నచో తానెంతతక్కువగామాట్లాడిన అంతబాగుండునని వారికే తెలియగలదు- ఇండియావిషయమైవారుతెలియజేసిన అభిప్రాయము రాజకీయదృష్టితోచూచిన మర్యాదగావున్నదని ఇక్కడయెవ్వరునువిశ్వసించరు. ప్రపంచములో యీయుద్ధమువల్ల రొట్టిసాంఘిక, రాజకీయమార్పులు జరుగవనియు, ఇదివరకువలెనే ప్రపంచములోని రాజకీయభేదాలుఉంటాయిందనియు, ప్రపంచముఇంకను ఇట్లేసాగుచుండునని యు, ప్రపంచభూభాగములో సాల్గవవంతు, జనసంఖ్యలోఆయిదింట ఒకవంతు బ్రిటిషుసామ్రాజ్యంక్రిందవున్నదనియు, ఇదివరకువలెనే బ్రిటనుసముద్రతరంగంమీద పరిపాలనాధికారముగలిగివున్నదనియు, ఏకొన్నికుటుంబాలుమాత్రమే ఈ కార్యముచేసిఅదృష్టం ఇట్లుపట్టినదనియు, పూర్ణమైనవిశ్వాసముగల సామ్రాజ్యతత్వవేత్త, దూరదృష్టియేమియులేకుండ, ప్రస్తుతమునకుసంబంధించిన బుద్ధినిమాత్రముఉపయోగించి తయారుచేసుకొన్న ఉపన్యాసమది-,

"జపానుమంచూకోపై ఆత్యాచారముచేసినప్పుడు తానుఆచర్యనుఖండించినా ఇండియాపైన, ఈజిప్టుపైనను బ్రిటిషువారుచేయుచున్నచర్యకు న్యాయమైనకారణము వున్నదనుచెపుచుపైన, అచర్యనుసమర్థించినవానివద్దనుండి ఇంతకంటె చక్కనిఉపన్యాసమును యెవరుఆశించగలరు? బ్రిటిషుప్రధానమంత్రి తనఅభిప్రాయములకు సంప్రదాయములకు అనుగుణ్యముగా ఉండుటకొరకై ఇంతకంటెప్రశస్తమైన ఇండియామంత్రిని తనకుసహాయకునిగా ఉంచుకొనజాలడు. కనుకఆప్రధానమంత్రి ఈసమయంలో మూనముద్రధరించి, అమెరీకియట్లుఇష్టమొ ట్లుచేయుటకైవిడచిపెట్టుట యెంతయుసహజలక్షణము- వారుతనకుపూర్వముందువారు అమెరికా ఐర్లాండులలో యెట్లు ప్రవర్తించిరో అట్లేఇండియాలో ప్రవర్తించుచున్నారు-

"జిన్నాతోబాటు అమెరీగారుకూడా ఇండియాలో ప్రజాపరిపాలనపద్ధతిని పనిచేయుటకతగినపరిస్థితులులేవని విశ్వసించినట్లయినచో, ఈయుద్ధము ప్రజాప్రభుత్వములదిగ్విజయంకొరకు పోరాడబడుచున్నట్లయితే, ఈదేశానికిబయలా ఈవిరోధాయుద్ధంతోఏమీ ప్రసక్తివుండవక్కరలేదు- నేడుప్రజాపరిపాలనముకాని ప్రభుత్వము లేదియుస్వపరిపాలనమును కలిగియుండజాలదు. అట్టిప్రభుత్వము స్వదేశీయమైనదో లేక విదేశీయమైనదో ఒకనియంతృత్వమైయుండగలదు- ఇండియాలోనిరాజకీయపక్షములు తమలోతాము చీలిపోరాడుచున్నవిషయం విదేశస్థులతమయాక్రమణరక్షణనిమిత్తం ఇక్కడనిలబెట్టినసైన్యము ఈదేశపునియంతృత్వమును సాగనీయదు. కనుకసర్వదా ఇదివిదేశీయనియంతృత్వమే అయియుండవలెను- ఇట్టిపరిస్థితులలో ఇండియారక్షణమంటే ఈవిదేశీయనియంతృత్వరక్షణమనియే అర్థము, బహుశా ఈకారణమువల్లనే ఇండియారక్షణచట్టముక్రింద గొప్పగొప్పదేశాభిమానులందరును జైయిళ్లకుపంపబడుచున్నారని చెప్పవచ్చును- వారు ఇండియారక్షణకు ప్రతికూలురుకారు- అమెరీశాశ్వతంగాకొనసాగించదలచుకొన్న ఈవిదేశీయనియంతృత్వమును రక్షించుటకేవారుప్రతికూలురు-

"కానిఅమెరీగారుఈమాటకుఒప్పుకోకుండా మహాత్మాగాంధీచర్యవల్ల తానున్నఈదేశంలోవున్న తనతాబేదారుప్రతినిధులున్న ఈసజ్జనులను జైయిలుకుపంపవలసివచ్చుచున్నదని వాదించుచున్నారు- అమెరీగారిఆధీనంలోవుంచబడి, వారిపనితరత్నకు పాలుచేయబడినకాంగ్రెసువారి భవిష్యత్తునుగురించి బ్రిటిషువారి ఇష్టమువచ్చినట్లు వ్యవహరించుటకు ఒప్పుకున్నట్లయితే వారలనువిడదిపెట్టుటకు వారుసమ్మతించియుందురు"

#### సర్ మహమ్మద్ యాఖూబ్ గారి అభిప్రాయము

సర్ మహమ్మద్ యాఖూబుగారు ఈక్రిందివిధంగా ప్రకటనచేసినారు:-

"అమెరీగారు అగస్టు ౧వ తేది కామన్సుసభలో చాలలోతైనఅర్థముగల ప్రకటనచేసినారు- బాధ్యతాయుతత్వమను లక్షణముతోకూడిన పార్లమెంటరీ ప్రభుత్వపద్ధతిని ఆచరణలోనుంచుటకు అవసరమైనపరిస్థితులు భారతదేశములో లేవనియు, అందువల్లఅపద్ధతి ఈదేశములో ఇక ఎంతమాత్రము ఆచరణయోగ్యముకాదనియు, స్వాతంత్ర్యము ప్రజాస్వామికవిధానము నిలిచియుండునట్లుచేయుటకై ఇతరపద్ధతులను ఆశ్రయించవలసియుండుననియు వారుచెప్పినారు. రాష్ట్రములలో బాధ్యతాయుతప్రభుత్వమును అమలులోనుంచినఅనుభవంవల్ల భారతదేశపు సెక్రెటరీ ఆఫ్ స్టేటుగారికికలిగిన వివేకోదయముకొంతనేనింకుపొందుగాక!

"భారతదేశమును హిందూరాష్ట్రములనియు, ముసల్మాను రాష్ట్రము అనియు, శాశ్వతంగా భారతదేశములో విభాగమునేర్పరచవలెనను కోరికనిరాశతో చేసినసూచనయున్నమాటనిజమే. కానిముసల్మానులు యీవిధానమువలంబించునట్లుచేయుటకుబాధ్యులెవరు? ౧౯౩౫ సంవత్సరపు భారతరాజ్యాంగశాసనముక్రింద బాధ్యతాయుతప్రభుత్వవిధానము ఆచరించినందువల్లకలిగినఅనుభవము, అసంతుష్టులవరుసయు ఈనిరాశతోచేసినసూచనకు మూలకారణము- దీనికిబాధ్యులైనవారే దీనినితొలగించగలరు- అందుకైగాను అల్పసంఖ్యాకులు ఎల్లప్పుడును హక్కులుకలుగుటకుండ దేశపరిపాలనయందు సమానభాగమును, అభివృద్ధికిసమానావకాశములను పొందుటకు సౌకర్యముఉండేపద్ధతిని అంగీకరించవలసియుండును- ముసల్మానులు అమెరీగారిప్రకటనగురించి శ్రద్ధతోఆలోచించి, ప్రొఫెసరు కూప్లండుగారివిధానమునెడ సౌకర్యముగారి సూచనలనుబట్టి ప్రస్తుతపరిస్థితినిబట్టి తమఅభిప్రాయమును నిర్ణయించుకొందురుగాక!"

#### సులేమానియా మసీదులోవిడోక్కులుసభ

హైదరాబాదు (దక్కన్), మెహరు ౩ రైట్-ఆ-సర్- హైదరీగారికి హైదరాబాదులోని సులేమానియామసీదులో వీడ్కోలుచేసిన ఆసందర్భములో వారిట్లనిరి- "శ్రీప్రభువుగారు నాకుఉపకారపేతనమిచ్చుటప్పుడు పలికిన మాటలను నేనెన్నడునుమరువజాలను- ఈరాష్ట్రముపైప్రీతి నాకెన్నటికితగ్గదు- ఇచ్చటనాజీవితంలో ౩౬ఏండ్లఉద్యోగంచేసికడిపినాను. ఈఇస్లామీయుమహమ్మదునకుగాను శాశ్వతంగాఅదియేపనిచేసినాను ఈరాష్ట్రము భారతీయముసల్మానులందరికిని ఏకైకకేంద్రము. నేనుహైదరాబాదునుండి సెలవుతీసుకొనివచ్చినను నాభార్యభౌతిక మిచ్చుటచే యుండుటచేత ఏటేటవచ్చుటకు తప్పకరాగలను నాకుమామూలిచ్చుటకే ప్రభుత్వము- ఇచ్చటవారుతమవలెనే సేవభక్తితోచేయగలరు. నేనెప్పుడున్నా హైదరాబాదు బావున్నతని కోరుచుండగలను-

## సికింద్రాబాదులో 17 తేదీ వరకు

ప్రతిదినము రెండుప్రదర్శనములు.

6 గంటలకు. 10 గంటలకు.

హైదరాబాదులో

మంగళవారము 19—8—1941 మొదలు

రాత్రి 10 గంటలకు

## ప్రొఫెసర్ దేవల్సు సర్కస్

కర్బలామైదానం, సికింద్రాబాదు.

## మ. ఘ. వ. నిజాంస్టేటు రైల్వే.

## నోటీసు.

జానకంపేట, బోధన్ రైల్వేలోని నెం 49 అప్ మరియు 50 డౌన్ మిక్సుడ్.

ట్రెయినులలో రాకపోకల మార్పు.

శుక్రవారము 1941 ఆగస్టు 15 వ తేదీనుండి నెం 49 అప్ మరియు 50 డౌన్ల రాకపోకలు ఈ క్రిందిప్రకారము మార్చబడినది.

| 50 | | | 49 | | |
|---|---|---|---|---|---|
| మిక్సుడ్ | | | మిక్సుడ్ | | |
| నిజామాబాదు | పోక | 6—10 | బోధన్ | పోక | 8—42 |
| బోధన్ | రాక | 8—02 | నిజామాబాదు | రాక | 10—55 |

వివరముగా టైములు తెలుసుకొనుటకు స్టేషనులలోని టైంటేబిలులో చూడండి.

చీఫ్ ట్రాన్సు సూపరింటెండెంటు ఆఫీసు,
సికింద్రాబాదు-దక్కన్
8 ఆగస్టు 1941

(సైన్డు)
బి. ఎ. జె. డన్‌లప్,
ఆక్టింగ్ చీఫ్ ట్రాన్సు సూపరింటెండెంటు.



Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn Editor S Prathapa Reddy B A B L